శిథిలాక్షరం

గౌరవ్

జూన్ 2015

వెల : 20/-

ప్రతులకు : 9032094492

వివరాలకు : gouravmeka@gmail.com

విజ్ఞప్తి : సుమారు దశాబ్ద కాలంగా అనేక సందర్భాల్లో చెలరేగిన విభిన్న మానసిక భావాలకు అక్షర రూపాలివి. మూలపడిన ప్రతిని ప్రచురించడానికి ప్రోత్సహించిన మిత్రులకు, వీట్ని ప్రచురించిన వివిధ పత్రికలకూ నా కృతజ్ఞతలు.

---

"I was at afork at the edge of the woods
There are two paths leading into the woods
I took the one less travelled
That made all the difference"

**– Robers Frost**

"In your house there is a lamp, and a friend
For me there is only night and stars;
For you theres is soil, for me only water;
For you there is rest, for me eternal wandering"

**– R. Tagore**

# సత్యం-శివం-సుందరం

**జీ**వితం వో గొప్ప కళాఖండం. చూసే మనసుండాలే కాని దైనందిన చర్యలన్నిటిలోనూ ఏదోక దివ్య సౌందర్యం వెల్లడౌతూనే ఉంటుంది. ప్రతి ఒక్కరికీ ఎప్పుడో అప్పుడు హృదయంలో అవ్యక్తమైన ఆనందం తలెత్తుతుంది. బయటపడని మాటలెన్నో మౌనంగా బోలెడు కబుర్లు చెబుతుంటాయి. ఎన్నటికీ రాయబడని భావదారలు ఎదలోతుల్ని కెలుకుతూ మదిలో శాశ్వత కవితల్ని చదువుతుంటాయి. ఇంతటి అపురూపమైన కళాత్మకతని అనుభూతి చెందాలంటే జగత్తంతట్నీ నిష్కల్మషంగా ఆరాధించే రస హృదయం కావాలి.

తొలి సంధ్యలోని పొగమంచుని చీల్చుకొనొచ్చే ఎడ్లబండ్ల మువ్వల చప్పుళ్ళని నిద్రమత్తు వదలని బద్ధకపు కళ్ళతో దుప్పట్లోంచి చూస్తుండటం కావొచ్చు. వేసవి సాయంకాలాల్లో ఒక్కసారిగా దూసుకొచ్చే ఎర్రాకాశంలోని కొంగలబారుల వెర్రెక్కిన పిల్లగాలులు కావొచ్చు. సుమధురమైన శృంగార కావ్యాల్ని అంకితం తీసుకున్న వెన్నెల రాత్రుల వన్నెల్ని చిందులేస్తూ అందెల్లా సవ్వడిచేసే వానచినుకులు కావొచ్చు.

ఆస్వాదించాలే కాని ప్రతిక్షణమూ ఒక అద్వితీయమైన అస్తిత్వమే.

రంగురంగుల ఊహల్ని అన్వేషించడం కోసమే మానుష ఉనికి చూస్తుంది. విభిన్నమైన అనుభవాల సంగమాల్ని రంగరించుకుని, చిత్రవిచిత్రమైన సృజనలతో ఆత్మికమైన రసజ్ఞతకి ఆధునిక సాధనాల్ని సమకూర్చుకుంటుంది.

లోకంలోని అనుభూతులన్నిట్నీ వ్యక్తంచేసే ప్రజ్ఞని మానవాళెప్పటికీ సాధించలేదు. వ్యక్తావ్యక్త యత్నాలతోనే అపారమయిన ఆనందాల్ని సృష్టించు కుంటుంది. సాహిత్యం, సంగీతం, నృత్యం, చిత్రలేఖనం, ఒక తరహా మతం, కొత్త మార్గం.... ఇవన్నీ మనిషి తన అంతరాత్మని వ్యక్తం చేసే కృషిలో భాగమే.

వ్యక్తి తనని ఆంతరికంగా వేధిస్తోన్న అలౌకికాభిరుచుల్ని ఐహికంగా భౌతికంగా అభివ్యక్తం చేయడానికి చేసే నిరంతర తపనలోంచే కళా తాత్వికత జనిస్తుంది. అలౌకికాభిరుచులంటే, తన చుట్టుపక్కల పరిసరాల ప్రభావంతో వ్యక్తి తన మనసులోని చింతనాత్మక సాధన ద్వారా ఆంతరికంగా సృష్టించుకున్న భావనా జగత్తు మాత్రమే. అన్నిసార్లూ ఇది వ్యక్తం కావాలనేమీ లేదు. అవ్యక్తం కానిదంతా అజ్ఞాతమనే భావన కూడా సరికాదు.

భావోత్పత్తికి నూతనత్వం ఒక సజీవ లక్షణం. భౌతిక ప్రపంచ దృక్పథాల ప్రభావం జిజ్ఞాసాత్మక హృదయాలపై ఉంటుంది. గతానుభవాల సాయంతో, గతించిన వ్యక్తుల గడించిన అనుభవాల్ని అర్థంచేసుకుందుకు ప్రయత్నిస్తూ, భావితరాల తత్వపిపాసకులకి, భవిష్యత్ శోధకులందరికీ తోడ్పడే పరిశోధనల్ని సమగ్రంగా క్రోడీకరిస్తూ, ఆరోగ్యవంతమైన భావాల్ని ఆదర్శవంతంగా అందించడమే కళాకారుల, రసజీవుల కర్తవ్యం. కవిత్వం కూడా దీనికి మినహాయింపేం కాదు.

అందుకోసం అందుబాటులోనున్న ఏ రూపాన్నైనా, ఏ మార్గాన్నైనా ఎన్నుకోవచ్చు. సారం మాత్రం సంతోషాన్ని అన్వేషించడమేననే విషయం మాత్రం మరిచిపోకూడదు.

మనుషుల్లో కృత్రిమత్వాన్ని తొలగించే సజీవ సమాజాల గురించిన స్పృహ రాకుండా, భావాలు మార్చుకోడానికి సిద్ధపడే మనస్తత్వాలు నిజాయితీగా స్పందించడానికి సిద్ధం కాకుండా కళ గురించి అందమైన పదజాలంతో జరిపే కసరత్తులు వృథా ప్రయాసతో కూడిన తాత్కాలిక ఉపశమనాన్ని ఇవ్వగలవేమోకాని దీర్ఘకాలిక ఫలితాలతో కూడిన శాశ్వత పరిష్కారాల్ని సూచించలేవు.

ఏది ఏమైనా యిది నా యత్నం,
ఆరు నూరైనా యిదో రకం కవిత్వం.

# అంకితం

నన్ననుభవించిన వేదనలకూ
నా వల్ల జనించిన రోదనలకూ

ఖేదంతో...

# కవితా క్రమం

# ఫార్వర్డ్

గాథలన్నీ సమావేశమైన వేళ
అక్షరాలకి స్వాగతం చెబుతున్నాను
గతించిపోయిన ప్రక్రియలన్నీ
ఒక్కొక్కటే మెలకువలోకి నడిచొచ్చాయి
రాత్రి కళ్ళుగప్పి ఎగిరిపోతున్న వెలుగురెక్కలు
చందమామలోని ముళ్ళమొక్కకి చిక్కుకున్నాయి
విశ్వపు వినువీధులన్నిట్లోను అడుగంటిపోయిన
చెమట సముద్రం సాక్షిగా
ఈ క్షణానికి నా ప్రణామం!

# అభ్యుదయం

గబ్బిలమయితే మట్టుకు ఏం
దానిది కూడా అభ్యుదయమే.
కర్మ సిద్ధాంతమూ కాదు
ధర్మ రాద్ధాంతమూ రాదు
కప్పదాటు తత్వమే కాని క(పి)విత్వం
రచయితలందరి లాగానే
అది కూడా రాత్రి సంచారే
అందుకే, అదెప్పుడూ చీకట్నే మాత్రమే అన్వేషిస్తుంది
అయినా దానిదీ అభ్యుదయమే
కలమెంత సరళమైనా
కంఠమెంత కళారసమైనా
గొంతెంత శ్రావ్యమైనా
గుణం మాత్రం జాడ్యమే
మోమెంత మృదువో
మనసంత మలినం
అయితేనేం
దానిది కూడా అభ్యుదయమే.

# స్మృతి స్రవంతి

విరమించిన ప్రతీ జీవితంలో ఒకానొక
నిషేధిత విషాదగీతంలా ప్రవహిస్తూ
స్రవించి ద్రవించి ఘనీభవించిన కన్నీటి
ప్రస్థానానికి ఆస్థాన కవిని రాస్తున్నానిదిగో
ఇది వినండి,
మొన్న మీరు నా దగ్గర దాచుకున్న రంగుల కల
రాత్రి జాగారాన్ని సగంలో నిలిపి నిద్రపోతుంటే
ముందుగానే పసికట్టిన దొంగ పౌర్ణమి
వొక్కసారిగా గోడదూకినప్పుడేం జరిగిందో
అది కనండి,
వేసవి తాపం భరించలేక చొక్కా విప్పిన అకాశం
ఇరానీ హోటల్లో సమోస ఛాయ్ చప్పరిస్తుంటే
ఎప్పుడూ పట్టాలు తప్పే పాసింజరు రైలు
సరిగ్గా సమయానికెలా రాగలిగిందో తెలిస్తే
నాకు చెప్పండి,
గంటకొట్టి మరీ బయలుదేరే సిగరెట్టు పొగ
వొంతులేసుకుని కోసే తొలకరి పంట
అంటరాని అగ్రవర్ణాల దేవుడి గుడి
ఒంటరిగా ఎందుకు వొట్టిపోయిందోనని
నన్నే అడగండి,
చెవుల పిల్లుల మధ్య బవురు కప్పలా
వర్షపు నీటిలో తేలుతున్న కాగితప్పడవ
కాలుతున్న మాంసపు కమ్మని వాసన
ఎండాకాలంలోని వడగళ్ళ గొడుగేదో
మీరే వెతుక్కోండి.

# తర్కానికి తద్దినం

మీకో అజ్ఞాత గ్రహాన్ని అప్పిస్తాను
మొత్తం నిర్వచనాల్తో నింపేయాలి
అదను చూసి ఆలోచిస్తుందేమో
మెదడు మొత్తం ఖాళీ చేయాలి
పొరపాటునైనా ప్రశ్నించకుండా
సత్యంపై అవిశ్వాసం ప్రకటించాలి
అన్వేషణా మార్గాలన్నింటినీ
అక్షరాల్తో మూసేయాలి
ఎక్కడా వెలుగనేది చొరబడకుండా
చీకటికి ప్రత్యేక హక్కులు కల్పించాలి
వ్యక్తిత్వాలెదగకుండా అస్తిత్వాల్నాహ్వానించాలి
జ్ఞానం తప్పించుకుపోకుండా
అజ్ఞానాన్ని కాపలా వుంచాలి
నిజాలెప్పటికీ నిద్రపోయేలా
కాకమ్మ కథలు చెబుతుండాలి.

# జీవించడానికి మరణించడానికీ మధ్య...!

ఒక సుదీర్ఘమయిన విరామం కోసం,
నిరంతరం జరుగుతున్న సుదూర ప్రయాణం
ఆదమరచి నిద్రపోతున్న చలిరాత్రుల్ని
చీకటిలో వెలిగించడం కోసం
గాఢమయిన బాధల అరణ్యంలో
ఘర్షణకి ఊపిరిపోయడం కోసం
హఠాత్తుగా తలుపుతట్టిన తొలకరి స్వప్నం
సెలవంటూ అలిగి అదృశ్యమైపోయినప్పుడు,
ఒంటరిగా మిగిలిపోయిన సముద్రం కోసం
రహస్య ఒడంబడికను రద్దుచేసిన వర్షపు మేఘం
భూమిమీదికి బరువుగా దిగి దిగవిడిచిన కన్నీటి కోసం
హృదయంలో రగిలిన పవిత్ర సెగ
పగబట్టిన ప్రపంచ జాడ కోసం
సూటిగా దూసుకొచ్చే సమిష్టి దుఃఖం
సమూలంగా సమాధానపడడం కోసం
నాటబడుతున్న కుట్రల నడుమ
విశ్వాసంగా మొలవడం కోసం
జీవించదానికీ... మరణించదానికీ మధ్య
విప్లవాన్ని వెతకడం కోసం
ఆకలికి ఆక్రందనలకి మధ్య
అసమానతలు లేని ఆరంభం కోసం...!

# ఒంటరి యుద్ధం

ఒక నూతన విశ్వాసం
గుండెల్లో నుంచి జనించింది
గదిలోంచి బయటపడ్డ ప్రళయం
స్వేచ్ఛవైపు దూసుకెళ్ళినట్లు
హృదయానికి కట్టుబడిన ఆశ
ఆక్రందనలు చేస్తూ ఆవేశపడినట్లు
భూమిని విశాలం చేసే బాధ
కన్నీళ్ళతో కంటికి దడి కట్టినట్టు
వొక మేల్కొలుపు!
మరో నిట్టూర్పు!
వ్యవస్థితమైన అజ్ఞానంతో
అక్షరం జరిపే ఒంటరి పోరు
సుశిక్షితమయిన అన్యాయంపై
తిరగబడ్డ అణిచివేత
అచేతనత్వం నుంచి చేతనత్వానికి
భావాల శాశ్వత పయనం.

# భగ్నహృదయం

ముత్యాల్లా మెరుస్తున్న ఆకాశ నక్షత్ర హారాల్ని ఆశగా చూస్తూ,
ఆంతరిక ఆవేశాలకు అభినివేశాన్నద్దుతూ,
నా గత జీవిత నేపథ్యంలోని చీకటి కథలకు
కలల్తో కలిపి రంగులేస్తున్నాను.

తరాల తరబడి నన్ను వెంబడిస్తున్న చైతన్య పథాలు
నిరంతరం పయనించే నిశీధిలోని నిశబ్ధ మార్గాలను
వేకువకోసం ఎదురుచూస్తున్న రాత్రికి అంకితం చేసి
అజ్ఞాతమయిన ధాత్రివైపుకు దూసుకెళుతున్నాను.

పుడమి కడుపులో పురిటినొప్పులు పడుతున్న ఆర్తనాదాల్ని
అసలెప్పటికీ బయటకు పొక్కని భావగీతాల్ని
ముగిసిపోయిన అభాగ్యుల జీవితాలతో మమేకం చేసి,
మహిమాన్వితమైన అక్షరాల్ని మలుస్తున్నాను.

తనివితీరా తనువుని నాలో ఐక్యం చేసుకుంటున్న
మార్మిక శరీరాన్ని ఆక్రమించుకుంటుండగా
అకస్మాత్తుగా వొక వింతైన విస్మయం!
తన్మయత్వంలో దాగున్న ఎర్రదనం!!

నేను రమిస్తున్న పదార్థ యదార్థ దృశ్యం
నేను గమిస్తున్న విశ్వపు విషాద గీతం
నెత్తుటి ముద్దగా మారిన ముగ్ధత్వం
నరాలు తెగి నగ్నంగా భగ్నమైన స్త్రీత్వం!

# నిషిద్ధాత్మ

నాలో రగిలిన భావాల అలజడికి
ఎక్కడో మిగిలిపోయిన ఆశ ఒక్కసారిగా మేల్కొంటుంది
బతికిన దినాల్లోని భారమైన క్షణాల తాకిడికి
ఒంటరిదైపోయిన వర్తమానం తెల్లబోతుంది
చీకటి అగాధాలను రహస్యంగా ఒడిసిపట్టుకున్న రాత్రి
వేకువలోనా నిషేధాత్మను మౌనంగా మేల్కొల్పుతుంది
నిష్కల్మషమైన నిశీధిలోకి మొదలయిన అన్వేషణ
విలువల పక్షంతో పోరాడుతున్న వివక్షని ఎదిరిస్తుంది
నా భావాలపై ప్రకటించబడిన యుద్ధం
నెత్తుటి గాయాలతో పవిత్రమవుతుంది
అణిచేయబడిన అక్షరాలన్నీ
అజరామర విజయగీతాలౌతాయి.

# అశరీరవాణి

దోసిలి నిండా జీవితాన్ని తీసుకుందామని
పూడిపోయిన హృదయంతో ఎదురుచూస్తుంటే
గతంలో నన్నొదిలి పోయిన వెన్నెల నావ
ఎండిపోయిన తీరంలో ఎగురుతూ కనిపించింది
అందుకుందామని వెంటపడితే అదృశ్యమైపోయి
గుర్తుపట్టలేనంతగా గగనాకాశంలో కల్సిపోయింది
ఎప్పట్నుంచో మండిపోతున్న మంచుముక్కను
కరిగించుకునైనా గొంతు తడుపుకుందామంటే
దాహం కూడా ఆరిపోయి ఆవిరైపోయింది
ఈ ఆఖరి అంకంతో నేనిక వేగలేను
ఆరంభ జీవితంలోని మృత్యువులోకి వెళ్ళిపోతాను
అజీవంగా కాక సజీవంగా చచ్చిపోతాను
నా అశరీరాన్నన్వేషించడం కోసం
ఎన్నిసార్లైనా ఇలాగే జన్మిస్తాను.

# కవిత్వంపై ఇంద్రధనుస్సు

నా ఊరి లోగిలిలో మందారపూలు
పొలాల మధ్య కలాల కచేరీ
శీతాకాల రాత్రుల్లో సీతాకోక చిలకల షికారులు
ఇంట్లో ఇంధ్రధనుస్సు.

నా ఇంటి చావిడిలో కనకాంబరాలు
కవితా హోరులో కాలిగజ్జెల హుషారు
వర్షాకాల సాయంవేళల్లో తుంటరి తూనీగల ఆటలు
మనసులో ఇంధ్రధనుస్సు.

నా మది గదిలో బొండుమల్లెలు
పిండివంటల హడావిల్లో పండగ వంటిళ్ళు
వేసవి కాలపు ఎండలో గండు చీమల విందులు
నాలో ఇంద్రధనుస్సు.

ఇప్పపూతోటలో ఇరుకైన దారులు
ఇనుపాయుధాలతో చారల జాగిలాలు
ఆకురాలు కాలపురాత్రి అడవిలో నీడలు
ఉద్యమంలో ఇంద్రధనుస్సు.

అక్షర హృదయంలోఆర్తనాదాల అన్వేషణ
విప్లవ పథంలో హక్కుల సాధన
గాయాల గతానికి వీడ్కోలిస్తున్న సూర్యులు
అమరత్వంలో ఇంద్రధనుస్సు.

గులాబీల పోరాటంలో గులాముల రాజ్యం
జ్ఞాపకాల్ని నంజుకుంటున్న స్మృతిగీతం
ఒకానొక సజీవ కవి సహజమైన ఉనికి
కవిత్వంలో ఇంద్రధనుస్సు.

# అభద్రత

సత్యం కోసం యుద్ధభూమిలో వెతుకుతుంటే
తెగివడిన శాంతి శకలాలు కనిపిస్తున్నాయి
కాలిపోయిన కళేబరాలు అడుగుతున్న ప్రశ్నలకి,
ఈ దేశపు లౌకికవాదం ఉరేసుకుంటోంది
ఇంతటి ఘోరాల్ని చూసి తట్టుకోలేని
మహాత్ముడు ఆత్మహత్య చేసుకొంటాడు
అధికారం మతోన్మాదానికి మారుపేరైనచోట,
అణిచివేతే పరిపాలనా సాధనమౌతుంది
బుర్రల్లేని ప్రజాస్వామ్యాన్ని చూసి
భూమిలోని బూడిద కూడా జాలి పడుతుంది.

# శూన్యం

వేగంగా నడుస్తున్నాను
పరుగులాంటి నడకతో
విశ్రాంతిలేని బడలికతో
వెనకెవరో తరుముకొస్తున్నారు
ఆగకుండా పరిగెడుతున్నారు
చెవుల్నిండా అరుపులు
కొన్ని కోట్ల కాళ్ళు
పొలిమేర దాకా ఆగే ప్రసక్తే లేదు
అదిగో ఊరు
తిరిగి చూద్దును కదా
వెనకంతా చీకటి!

## శీర్షిక

పుస్తకానికో శీర్షిక కోసం
సుదీర్ఘంగా వెతుకుతున్నాను
అన్నీ శవాలే
పోరాడి తెగిపడిన మొండాలే
అస్తిత్వపు స్థితి ఏదయినా
అంతిమ గతి ఒక్కటే
అల్లాడిపోతున్న నా మెడకి
బిగిస్తున్నవి నీ ప్రేవులే కదా
ప్చ్, పాపం!
నీ శృంగార సముద్రంలో
నేనో వీర్యపు చుక్కని
నా సాంఘిక సమరంలో
నువ్వొక నెత్తుటి బొట్టువి
అయినా
రమించడానికి నీకన్ని మోహాలెందుకో అర్థం కాదు
జీవించడానికి ఇన్ని మరణాలెందుకో పాలుపోదు
బహుశా
నా తత్వానికి నీ రక్తం వ్యతిరేకమేమో
కాపురాన్నే సరుకుగా మార్చిం తర్వాత
ఇక నీకు ప్రపంచాన్ని కనే అవకాశమేది?

# నేను

మొండిగోడల పైన నగ్నంగా నడుస్తున్న నీడలు
పాడుబడిన మేడల్లో ప్రజాస్వామ్య ప్రపంచం
ఇరుకింట్లో కొత్త నవ్వులు
దేహాల పాపానికి నలుగుతున్న పువ్వులు
స్థితిల లయల సామూహిక సంఘర్షణ
శబ్దంలేని నిశ్శబ్ద నిశీధి
మొండిగోడలపై పూర్వపు జాడలు
కలంతా కల్పన కాదు సుమా
కవిత్వం నిజమనుకోకు సుమీ
ఒంటికొమ్ము రాక్షసుడి రాజ్యంలో
నిండుగా విరబూసిన వెన్నెల
ఎంతో కాలంగా ఈతకొడుతున్న
నావికుడి కాలికి తగిలిన నేల
ఎడారి వోడని చంపి నోరు తడుపుకుంటున్న
అభాగ్యుడికి కనిపించిన మంచినీటి సముద్రం
కుళ్ళిపోయిన కలాల్లో శిధిలాక్షరాలు
శిరసావహించేదెవరు?
తత్వం-సత్యం-జీవితం
బాల్యం-యవ్వనం-వృద్ధాప్యం
గాల్లో తేలే వాయువు
గంగలో మునకేసిన విప్లవం
గదంతా ఒకటే మృత్యువు ఘాటు
గడియ వేసుకుని రాసుకుంటున్న నా శవం!

# చరిత్ర

ఇక్కడీ మహాసముద్రపొద్దున
ఎన్ని శతాబ్దాలుగా కూర్చున్నానో!
కన్నీటి ఉప్పెనలో కొట్టుకుపోయిన
జీవితపు నౌకని తలుచుకుంటూ
ఎన్ని పడవల్ని గమనించానో
అన్నీ నావేనని భ్రమించాను
కాళ్ళు కెరటాల్తో కబుర్లు చెప్తుంటే
కళ్ళు కడలి కడుపుని తడుముతున్నాయి
నోహా కంటే పూర్వమే నా నౌక బయలుదేరిది
కోలంబస్ కన్నా ముందే అగ్రరాజ్యాన్ని చేరింది
ఆ చరిత్రంతా సంచులతో పట్టి దాన్లో దాచా
ఏ దొంగలు పట్టుకెళ్ళకుండా ఉంటే
ఏ జడివాన జల్లెదపట్టకుండా ఉంటే
ఏ చెదా పట్టకుండా ఉంటే
ఎవరూ చెరపట్టకుండా ఉంటే
చింకిపోకుండా - చీకిపోకుండా
చిలికిపోకుండా - చెరిగిపోకుండా
ఉంటే, అంతేచాలు
నా సంచుల్ని దించేసుకుంటాను
మరో సముద్రంలో ముంచేసుకోడానికి!

# సందేశం

నిరాశ కోసం నా అన్వేషణ
ఆశల వర్షం జడివాన అవకుండా
సముద్రంలో శాంతి చర్చలు చేస్కోవాలి
సగం తెగిన నీ నగ్న దేహం
మొండిగా నా ముందు నాట్యం చేస్తుంటే
కళ్ళ ముందు కదలాడే కల్లోరం చాలక
మెదడు విచ్ఛిన్నం చేసుకుంటాను
ఎందుకో ఎరగను కానీ
నా మనసెప్పుడూ పదునుగా
నన్ను బాదిస్తూనే ఉంటుంది
దాన్ని ఆనందపరచడం కోసం
నన్ను నేను ఎన్నోసార్లు
హత్య చేసుకున్నాను
ఇంకా చేసుకుంటూనే ఉన్నాను
సగం కాలిన దేహానికి
సంజాయిషీ ఇస్తూ
మెదడుకి తాళం బిగించుకుంటాను
క్షమించండి
ఇంకెప్పుడూ మెదడ్నుపయోగించను!

# దృశ్యం

మన గత స్మృతుల ఘాటు జ్ఞాపకాలు
నా వర్తమాన విరహపు గుండెలపై
చెరిగిపోని గుర్తుల్ని వెచ్చగా ముద్రిస్తాయి
ఎండిపోయిన ఎడారి అట్టడుగు పొరల్లోంచి
నింగి నుంచొచ్చే నీటి కోసం ఆబగా చూసే
బాటసారి భావాలు
వసంత కోకిల వడివడిగా నడిచిన
వయ్యారి స్వప్నపు వీధుల చిరుదారుల్లో
దాగుడుమూతల దృశ్యాలు
పచ్చని పంట పొలాల పచ్చి సువాసనల్ని
ఆబగా జుర్రుకుంటున్న ఆకతాయి
సీతాకోకచిలుకల అల్లరి ఆగడాలు
పచ్చిక బయళ్ళపై పొగరుగా ఎగురుతూ
అక్కడున్న నా అంతరాత్మలోకి తొంగిచూసాయి.
అంతే,
ఆశ్చర్యంగా వాటికక్కడ
నా హృదయానికి బదులు
నీ ద్రోహం కనిపించింది!

# స్వగతం

కన్నుల సుడిగుండాల్లో నిషేధించబడ్డ జ్ఞాపకాలు
అంతరిక్షంవైపుకి సాగుతోన్న ఆర్తనాదాలు
ఒరిగిపోయిన చెట్ల మధ్యలో ఒంటరిపోరు
కడలిపై కెరటం తిరుగుబాటు
తియ్యటి గుండెల్లో లోతైన సాక్ష్యం
ఏదీలేని ఆది
మార్పొక్కటే మన విధి
ఎగిరే తుమ్మెద రెక్కలపై
వీగిపోయిన విప్లవ చరిత్ర
చేతికొచ్చిన చేల మధ్య
రాజుకున్న స్మృతుల మంట
ఎడతెగని సముద్రపు హోరు
ఎక్కడా కనిపించని ఒడ్డు.

# నీతి

ఈరోజునిలా తీరంలో కూర్చుండగా
అలా నీ పిలుపు వినిపిస్తుందనుకోలేదు.
ఎన్నో శతాబ్దాల ఎడబాటుని
ఒక్క తరంగం తుంచేస్తుందనుకోలేదు.
మనం గడిపిన ఎడారి శీతల రాత్రుల్లో
వేడి ఎప్పటికీ చిరస్థాయిగానే ఉంటుంది
నన్నయితే వేరు చేయకలవు కానీ
వెన్నెల్ని నా కళ్ళలోంచి చెరిపేయలేవు
యెన్నో అశరీర అనుభవాలు గడిపిన నాకు
నీ శరీరం నూతన ఆవేశాన్నిచ్చిందేమో
కొన్నాళ్ళకైనా మారుతుందనుకున్న
కొందరి మానసిక వైఖరి
అమ్ముడుపోడానికే నిర్ణయించుకున్నప్పుడు
నా అభిప్రాయాలపై ఎంత బలమెచ్చిందో
నీ ఆలోచనలకి అంత జాలి కలిగింది
అందుకే
నా కళ్ళల్లో నీతిని చూస్తే శక్తి
నీ కృత్రిమ ఆకర్షణకి ఉండకపోవచ్చు.

# సత్యం

అక్షరాలన్నీ హస్తప్రయోగం చేసుకుంటున్నాయి
మానసిక వికృతితో మలిన పడకుండా
స్వీయ నియంత్రణ కోరుకుంటున్నాయి
గతించిపోయిన నీచత్వాన్ని మర్చిపోయి
దిసమొలల్తో బయలుదేరాయి
అవశరానికి వాటికి ఆపాదించినవన్నీ
మనుషుల అవలక్షణాలే కానీ
అక్షరాలకెప్పుడూ ముసుగులూ లేవు
అక్షరాలెవరికీ తొడుగులూ కావు
అయినా
సంతాపం తెలపడానికి మాత్రమే
మనం అక్షరాల్ని కలుపుతున్నాం
కనుక
సంతానానికివ్వడానికి ఆస్తులే కాని
అక్షరాలు మిగలకపోవచ్చు
అందుకే
భావి అక్షరాలన్నింటినీ
బహుశా
అసత్యాలుగానే భావించాలేమో.

# కోరిక

నిన్ను కౌగిలించుకోవాలని
గాఢంగా తపిస్తుంటే
తత్వం తంలపుకొస్తుంది.
పదిలంగా పర్చుకున్న జ్ఞాపకాలన్నీ
ఒక్కసారే తారుమారై
భరించలేని బాధాబిందువులుగా
మనసులోంచి ఉబుకుతుంటాయి.
అయినా నా పిచ్చికానీ
అంతరాత్మ సొంతది కాకుండా అయినప్పుడు
ఐహిక అనుభూతుల సారమేదీ?
నరాలన్నింటినీ తెగేసి లాగినట్లు
నెత్తురు ఊగిసలాడుతుంది
ఎంతైనా నిజం నిజమే
కాకపోతే అబద్ధమే అవ్వాలిగాని
మధ్యస్తమంటే ఒప్పను నేను.
గాథలన్నింటినీ కలగలిపి గుచ్చుకోవడమంటే
స్వతహాగా శిక్షించుకోవడమే అంటాన్నేను.
ఆపద్దు నన్ను
ఆద్యంతం లేని తీరానికి తరలిపోతాను.

# ఆత్మాహుతి

ఊహలన్నింటినీ ఉరితాడుగా వేసుకుని
ఊసులకు బిగించి కట్టాను
అన్ని ఆలోచనల్ని ఒక్కమారే
చంపడానికెందుకో మనసొప్పడంలేదు
ఒంటరిగా ఒక్కొక్క భావాన్నే
బావిలోకి తోసేస్తే బాగుండు
వాటి బరువింక మోయలేను
సంచీలో పెట్టి భూమిలో పాతేస్తాను
వాటి సంచారాన్నిక భరించలేను
ఇలా ఎన్నిసార్లు హత్య చేసానో
అన్నిమార్లూ తిరిగొస్తున్నాయి
ఇక చాలు
విసిగివేసారిపోయాను
వీటితో ఇంకెంతమాత్రం వేగలేను
ఆలోచనల్ని స్తంభింపజేసి
అంతరాత్మని అంధకారం చేస్తాను
అస్తమయం వైపుగా సాగిపోతాను
అలసిపోయినా - సొలసిపోయినా
వెలుతుర్లో మట్టుకింక గడపలేను
అరుణోదయంపై కరుణ చూపలేను.

# అన్వేషణ

సముద్రం చిక్కగా ప్రవహిస్తోంది
నా నావ చిక్కుల్లో ప్రయాణిస్తోంది
ఆకాశంలో చుక్కల్ని వలేసి పట్టుకోవడం కోసం
చాలా కాలంగా సంద్రంలో పయనిస్తున్నాను
చీకట్లో మాత్రమే సంచరించే దొంగ నక్షత్రాల్ని
ఎలాగైనా పట్టుకుని ఇంటికి తీసుకెళతాను
అక్కడెన్ని గుండెలు వాటికోసం ఆతృత పడుతున్నాయో
కొంచెం ఆలస్యమయితే అయింది గానీ
ఒక్క నక్షత్రాన్ని కూడా మిగల్చకూడదు
నింగిలో కాంతి జాడల్ని కనబడనివ్వకూడదు
నా భూమి కళ్ళల్లో వెలుగు చూసి ఎంతకాలమయిందో
నా ప్రజ కడుపులో మెతుకు పడి ఎన్నేళ్ళయిందో
చరిత్రని చీకటి కొట్లోపెట్టి ఎన్నాళ్ళయిందో
అయిందేదో అయింది గానీ అవకాశం ఒదులుకోలేను
ఆకాశాన్ని విడిచిపెట్టి అవివేకుణ్ణి కాలేను
ఎప్పటికైనా నక్షత్రాలన్నిటీన్నీ
నాతో నడిపించి తీసుకెళతాను
పుడమిలో పాతి పాదులు వేస్తాను
వెలుగొచ్చేంత వరకూ వ్యవసాయం చేస్తాను
కాంతినందించే వరకూ కమతం చేస్తాను
ముందు
నక్షత్రాల్ని తెచ్చి నాట్లు వేయాలి
అవంటూ పూలు పూయాలంటే
అమరత్వంతో వాటికి అంటుకట్టాలి
విప్లవ వృక్షాలతో సమతా హలంతో
మమతపు పంటల్ని పండిస్తాను
అప్పటిదాకా సంద్రంలోనే సంచరిస్తాను
నావ పై నిర్విరామంగా ప్రయాణిస్తాను.

# భిన్న

సుప్రభాత కిరణాల సుతిమెత్తని స్పర్శ
మండుటెండలో మెదడు సెగలు
మలిబారిన మనసుల ముతక మోహాలు
గాల్లో గంధర్వుల సంచార సాహసం
గాయపడిన ఒంటరి జ్ఞాపకం
అపరిచిత కంఠం ఆలపించిన ఆఖరి స్వరం
ఉభయ మృతదేహాల శృంగారం
సుదూర తీరాలకి జరిగిన స్ఫూర్తి
కదలి కెరటాల కవిత్వపు హోరు
కాలాన్ని జయించిన సంఘర్షణ
అక్షరానికి అభిమానుల విరాళం
పరస్పర వైరుధ్యాల ఏకత్వం
వ్యవస్థ హృదయంపై మొల్చిన మొక్క
ఒళ్ళంతా గొంగళిపురుగుల జలదరింపు
వీర్యంతో ఆజన్మాంత సావాసం
ఎండిపోయిన రొమ్ములపై మోహావేశం
అహంతో అలౌకిక ఐక్యం
చీముపట్టిన భావావేశం
చీడ తినేసిన అభినివేశం
అంగాల్ని అమ్ముకుంటున్న అభ్యుదయం
అక్షరం ఆకలి కేకలు
అభిప్రాయాల అలజడి
దుప్పట్లో దేవుడితో వ్యభిచారం
క్షుద్ర దత్తి తీర్చుకున్న భక్తి
సర్వేజనా సరుకోభవంతు.

# పరబ్రహ్మాం

ఈ దేవుడికి వేరే పనేదీ లేనట్లుంది
ఎప్పుడూ దేభ్యపు మెహమేసుకుని
దెయ్యంలా నా వెంట పడుతుంటాడు
అప్పటికీ నచ్చజెప్పి చూసా, అయినా
అసలు మాట వినందే
సృష్టికర్తను నేనేనంటూ అంతెత్తున లేచాడు
ధ్వంసవిధి నాదేనంటూ అసహ్యంగా పేలాడు
బ్రహ్మ పదార్థానికర్థం చెప్పాడు
జన్మరహస్యం తాత్పర్యం బోధించాడు
విషయమంతా విని చివరికి
ఆకలి గురించి అడిగానో లేదో
అప్పటికే మాయమైపోయాడు
మరెప్పటికీ ప్రత్యక్షం కానంటూ.

# సంకెళ్ళు

కంఠంలోంచి కలంలోకి ప్రయాణం
కటిక చీకటితో నా జటిల పోరాటం
వెలుతురుని వేరుచేసే విశ్వాసం
వ్యవస్థ వికృటహాసం
నిజంతో పనిలేని నైజం
మన నియంతృత్వం
అవిశ్రాంత యుద్ధ కాంక్ష
అనంత రక్త పిపాస
పొందేందుకు పరాజయం లేదు
పాలించేందుకు ప్రజలూ మిగల్లేదు
అయినా
నియంతల ఇచ్ఛ నియంత్రించేది కాదు
సమానత్వం సర్వదా ప్రమాదమే
చరిత్రెంత ఇరుకయినా కానీండి
అందులో మనదంటూ ఒక ఈగ ఉండాలి
తప్పదు
సామ్రాజ్యాల్ని స్థాపించాలి
సమాధుల్ని పరిపాలించాలి
అప్పటిదాకా
సమాధులకి సంకెళ్ళేద్దాం
సమానత్వం బయటికి రాకుండా.

# శిథిలాక్షరం

సరిగ్గా సమయానికి
కలంలో సిరా ఐపోయింది
సరే రక్తాన్ని నింపి రాద్దామంటే
అక్షరానికి నెత్తుటి వర్ణం అంటుతుంది
పోనీ సగంలోమానేద్దామా అంటే
కవిత్వం అర్థాంతరంగా ముగియనంది
నాకు–కలానికి–కాలానికి
అక్షరానికి–రక్తానికి–కవిత్వానికి మధ్య
చర్చలెన్ని జరిగినా సమస్య తీరలేదు
సామరస్య వాతావరణం రాలేదు
ఇక తప్పక
నా అహాన్ని చంపి
అంతరాత్మని కవిత్వంలో కలిపాను
అతి కష్టంతో
కలాన్ని బతికించి
కవితకు ప్రాణం పోసాను
కానీ
కవిత్వం మాత్రమే మిగిలుంది
పోసిన ప్రాణం మరణించింది.

# ఉష్... ఉష్!

గోడలోకి మళ్ళీ దొర్లిపోతుంటే
రాకాసంత బల్లి చచ్చిపడుంది.
ఇందాక తిన్న పెరుగన్నమింకా
అరక్కుండానే ఆవకాయనడుగుతోంది.
ఈ దారంతా బంకమట్టి
బురద బతుకుల్లో నిలవనీరు
నల్లబడిన ఆకాశం
చిల్లర చిల్లరగా పడుతున్న వర్షం
బూడిదరంగు అప్పడాలకర్ర
తిరుగుతోన్న రొట్టెలపీట
తీసిపోయిన కొత్త పరుపు
కుండీల్లోని పూలపై వాళ్ళనెత్తురు.

# ఇంకెన్నాళ్ళు...?

ఎన్నిసార్లు నా శవయాత్రలో పాల్గొన్నానో
అన్నిసార్లూ అక్షరాభ్యాసం చేస్కున్నాను.

గడియపెట్టి వెనుతిరిగానో లేదో
ముందంతా నక్షత్రాల పట్టెమంచం

భోరున వానలో సముద్ర వీక్షణం
గుండెల్ని తన్ని వెళ్ళిపోతున్న కెరటాలు

అమాయికంగా చూసే కుందేలు బేల కళ్ళు
ఆర్తిని సూటిగా పొడిచిన ద్రోహపు ఈటె

గతించిన జ్ఞాపకాల తియ్యటి ఊసులు
మోసపోయిన త్యాగానికి చేదు గుర్తులు

లోకంలోని సౌందర్యాల రాగాలాపన
నాలోని విషాదగీతాలకి శాశ్వత విరామం.

# స్వస్వర్గం

ఎన్నెన్ని వెచ్చటి ఉదయాల్ని
దుప్పట్లో పొదుపుకుని పడుకొన్నానో!
పచ్చటి చిరునవ్వుల్తో చెట్లన్నీ
నాకు స్వాగతం చెబుతూంటే
ఎన్ని పిల్లగాలుల్ని ఆబగా పలకరించానో!
మాడు మీగడలాంటి ఎడారి కొండల్లో
పండు వెన్నెల పహారా కాస్తుండగా
ఎన్నెన్ని చలిరాత్రుల్ని చిలిపిగా చిలకరించానో!
నిండు జాబిల్లిని నింపాదిగా వెంబడిస్తూ
వెర్రి జ్ఞాపకాల్ని పదిలంగా భద్రపరుస్తూ
ఎన్నిరకాల చీకట్లని చెక్కిళ్ళలో దాచుకున్నానో!
పావురాల సుప్రభాత నాదాల్ని
మయూరాలు మార్మిక నాట్యాల్ని
ఎన్నింటినని ఏరి మదిలో పెట్టుకోను?
ఎన్నాళ్ళిలా ఒకే గదిని కట్టుకోను??

# దినచర్య

పరస్పర బావాల వైరుధ్యం నాలో తలెత్తినపుడు
స్పష్టాస్పష్ట మార్గాల్లోని స్మృతులు మేల్కొంటాయి.
విరుద్ధ అభిప్రాయాల కలబోతతో
చరిత్ర తన స్వరాన్ని సవరించుకుంటుంది.
జారిపడిన గాథలకైన గాయాలన్నిటీ్నీ
నిరవధిక గమనంతో మాన్పుతుంటుంది.
అవును
నన్ననుసరించిన అరణ్యాలన్నింటినీ
నిశీధిలోని శిఖరానికొదిలేసాక,
ఇంకెన్నిసార్లు అన్వేషించినా
నాకు నేను ఖాళీగానే కనిపిస్తున్నాను.

# సమాగమనం

నేనిక్కడ దుఃఖాన్ని రచిస్తున్నాను
కొద్దినెలలపాటు నాలో ఐక్యమైన
మనసు చేసిన చిత్రాన్ని చిత్రిస్తున్నాను.

నేనిక్కడ గుండెకోతను అనుభవిస్తున్నాను
అయాచితంగానే ఎదురైన విషాదాన్ని
అనుకోకుండా వేరుచేసుకుని కలవరపడుతున్నాను.

నేనిక్కడ నిజాన్ని ధరిస్తున్నాను
ఒంటరి యవ్వనం విరిసిన ప్రేమగీతాల్ని
ద్రోహపు వాయిద్యాలద్వారా వింటున్నాను.

నేనిక్కడ భయాన్ని ఆహ్వానిస్తున్నాను
పిచ్చెక్కిన రాత్రుల జ్ఞాపకాల కోతలపై
ధిక్కార కలాన్ని నడిపిస్తున్నాను,

నేనిప్పుడు ప్రాయశ్చిత్తాన్ని పరితపిస్తున్నాను
చేసిన నేరాల వివరాల్ని మృత్యువుతో చెబుతూ
జీవితంతో కుస్తీ పడుతున్నాను.

నేనిక్కడ దుఃఖాన్ని రచిస్తున్నాను
కొద్ది నెలలపాటు నాలో ఐక్యమైన
మానసిక చిత్రాన్ని చిత్రిస్తున్నాను.

# నాదస్వరం

బంధాల్ని మనసులోకి చేరనీకు
వియోగం తప్పనిసరౌతుంది
బాధల్ని భరించలేక బయటపడ్డావా
స్నేహం రాబందులా ఎదురుచూస్తుంది
యవ్వనాన్ని సంతోషంగా పంచుకున్నావా
అక్కసు బుసలు కొడుతుంది
ప్రతిభకు సమాధి కట్టెయి
ప్రజానీకంతో దానికెపప్పటికైనా ప్రమాదమే
ఇక ప్రేమంటావా
అదో శిధిల పదం
పరారీలోనున్న నిషేద స్వరం
స్వగతానికి స్వాగతం చెప్పి,
నిన్ను నువు రాసుకోవడం మొదలెట్టాక
మోసే బరువు తేలికైంది
ఈ విషాదాన్నిక ఉపేక్షించకు
ఏ నిషాకి అక్షరాన్ని అర్పించకు.

# గౌరవ్ ఇతర రచనలు

1. ప్రజాస్వామ్య పతనం
2. అరాజకత్వం అంటే ఏంటి?
3. సాంఘిక తత్వం - వైప్లవ మార్గం
4. ఒక నాస్తికుడి నామా
5. ప్రజాస్వామ్య ప్రస్థానం
6. అస్తిత్వం - అరాజకత్వం
7. మద్యంపై యుద్ధం
8. మతానికి మరణశాసనం - మనిషికి పునరుజ్జీవనం
9. కరపత్రాల కథాకమామిషు
10. తత్వ విచారణ - తర్క వివేచన
11. పురుషుడు - స్త్రీ (చలం Man & Womanకి స్వేచ్ఛానువాదం)
12. కులానికి సవాలు
13. ప్రకృతి - శాస్త్రం - సమాజం
14. ధిక్కార స్వరాలు (భావోద్యమకారులింటర్వ్యూలు)
15. సంపూర్ణ ప్రజాస్వామ్యం దిశగా (జయప్రకాష్ నారాయణ్ వ్యాసానువాదం)
16. హేతువాద దృక్పథం - విధానపర కర్తవ్యం
17. కలాలు - కరపత్రాలు
18. పార్టీరహిత ప్రజాస్వామ్యం సాధ్యమా?
19. సద్ధమ్మ స్వరాలు (బౌద్ధోద్యమకారుల ఇంటర్వ్యూలు)
20. విస్మృత స్వరాలు (గాంధేయవాదుల ఇంటర్వ్యూలు)

"నా భావాలపై ప్రకటించబడిన యుద్ధం
నెత్తుటి గాయాలతో పవిత్రమవుతుంది
అణిచేయబడిన అక్షరాలన్నీ
అజరామర విజయగీతాలౌతాయి."

